శ్రీరస్తు

# విజ్ఞప్తి

---

మహాశయులారా

నేటికి సుమారు రెండువందల సంవత్సరములకు పూర్వుడగు మాటూరు వెంకటేశంగారు (1 బుధమనోల్లాస శతకము 2 రామాజానకీనాయకా అను శతకము 3 మాటురివాస శతకము 4 మాటూరి చెన్నకేశవశతకము 5 రాయపట్న పురవాస వేణుగోపాలదేవ యను నీయైదు శతకములనురచియించిరి) యీశతకములు కేవల భక్తిరస ప్రాధాన్యముగా తేట తెలుగున యొప్పారుచున్నయవి వీటిని మా పెద్దలు తిరిగి ప్రతులుగా వ్రాయుటచే కొంత శైథిల్యమొందుటయు నక్కడక్కడ పదసూత్రిలోపములు జరుగుటచే తిరిగి యొనగూర్చిన శ్రీమాన్ శేషాద్రి వెంకటకవిగారికిని, యీ పుస్తకముల సరిచూచిన శ్రీమాన్ కోరాండబట్టరు వెంకట కృష్ణమాచార్యులవారికిని, మ॥ రా॥ శ్రీ॥ మాటూరి లక్ష్మీనృసింహారావు గారికిని నాకృతజ్ఞతాపూర్వక వందనముల నర్పించుచున్నాడను

ప్రస్తుతము (1 రామాజానకీనాయకా 2 మాటురివాస) అను నీరెండుశతకముల నచ్చొత్తింప గలందులకు

శ్రీరస్తు

# జానకీ నాయక శతకము

శా॥ శ్రీరామా రవివంశజా రఘుపతీ సీతేశ శ్రీరాఘవా।
తారేశాయుతసార చారువదనా దాక్షిణ్యరత్నాకరా।
మారీచాదిసమస్తదైత్యహరణా మార్తాండకోటిప్రభా।
మారారి ప్రముఖామరాళినుత రామా జానకీనాయకా

శా॥ రామా! రామ! కృపాసముద్ర రఘువీరా! ధారుణీవల్లభా! సోమాబ్జప్రియకోటితేజ! రవివంశోద్ధార! శ్రీరాఘవా! శ్రీమాటూరిపురీశ కృష్ణ! కమలాచిత్తాబ్జభృంగంబయి! మ్మా మా కోరిక లన్నియున్నిపుడు రామా! జానకీనాయకా 2

మ॥ నినువర్ణింపఁగ నెంతవాఁడ మదిలో నీపాదపద్మంబులే।
ననిశంబున్నతభక్తితోఁ దలఁతు నాయందుంగృపం జూపవే। నిను వర్ణింపగ శక్తిహీనుడను నా నేర్పేర్పడన్ బద్యముల్। మనసొప్పన్ రచియించి నీ కిడుదు రామా జానకీనాయకా 3

మ॥ చదువుల్మిక్కిలి నేర్వలేదు జపముల్ సల్పంగ నేనేర నీ।
పదపద్మంబులు నమ్మినాఁడ మదిలో పాపఘ్న సర్వేశ నా।
రదమౌనిస్తుత రామ భూరమణ రారా యంచుఁ గీర్తింతు న।
మ్మదముంబొందుచు నన్ను గావు మిఁక రామా జానకీనాయకా 4

మ. కరినింబ్రోచినభంగి నింద్రతనయుఁ గన్గొన్నచందంబు
నన్ । మఱియాద్రౌపదిగాచుకీర్తి ధ్రువు సన్మానించుభా
వంబునన్ । గఱిగా భీష్మునిఁజూచుపోలిక నన్నుం గూడం
గృపఁజూడవే। మరియాదల్లనకుందభక్తునెడ రామా జా
నకీనాయకా ౫

మ. సిరులన్ నమ్మఁగలేదు, భూమిపతులన్ సేవింపఁబోలేదు
ని । న్నెఱుఁగన్ నేరని దుష్టమానవులతో నింపెంతగావ
చ్చినన్ । మురియన్ లేదు, సమస్తభంగులను నిన్నే
నమ్మి నీనామసం స్మరణ జేసెద గావవే దయను
రామా జానకీనాయకా ౬

మ. మదిలో నిన్నుఁదలంచియుం శరణనన్ మన్నించుచం
దంబులున్ । విదితంబై బహుశాస్త్రముల్దెలుపఁగా వే
మాఱు నిన్వేఁడినన్ । సదయత్వంబున బ్రోవవేమియిఁక
దోసం బెంతయుం జేసినన్ మదిలో నీవని నమ్మియుం
టిఁగద రామా జానకీనాయకా ౭

మ. కరుణన్ గావవదేమి భక్తునియెడన్ కౌటిల్యమింతేటికిన్।
శరణన్నంతనె శత్రుసోదరున కాచంద్రార్కమానట్టి
యా । వర మేలాగున నిచ్చితో, కపటక్రవ్యాదేశనె
ట్లోమితో మఱపుల్ నాయెడఁగల్గెనా యిపుడు రామా
జానకీనాయకా ౮

~ నినునేఁగొల్చెదనంటి నీచరణముల్ నేనమ్మినానంటి నా।
వినయోక్తుల్విను మంటి దోషముల నుర్విన్ మాపుమంటిన్
వరం । బనిశంబీమనియంటి, నిన్ విడచి దేవా యన్యునే

పించ నా మనముం బాయక నిల్వుమంటి గద రామా
జానకీనాయకా ౯

మ మఱువంబోకు పరాకుగాకు పరమిమ్మా నాకు నే దైవ
ము౯। సరిగా రెన్నఁగ నీకు, నీగుణకథల్ సల్పంగఁ బోబోకు
నా మొఱయాలించుటగొప్పనీకు, నదియే మోయంటి
వానాఁడ నీ। మఱియాదల్పనకుండనుండుఁగద రామా
జానకీనాయకా ౧౦

మ మిము నేనమ్మినవాఁడ నాయెడను స్వామీ మున్ను ప్ర
హ్లాదుని౯ । విమలాత్ముండగు నవ్విభీషణుని దేవేంద్రా
త్మజు౯ ద్రౌపది౯ । ప్రమదంబిచ్చుచుఁ బ్రోచినట్లు నను
సంభావింపు కారుణ్యత౯ । మమకారంబులువాసి గొ
ల్చెదను రామా జానకీనాయకా ౧౧

మ అహిశయ్యంబవళించుచు౯ గరుడవాహారూఢిచే నొప్పు
చు౯ । దహనజ్వాలలమించు చక్రమర చేత౯ బట్టి దై
త్యాళి౯ । బహుభంగి౯, దునుమాడి సర్వజగముల్
పాలింతువే వేళ నీ । మహిమంబు ల్గనిచూడ నావశమె
రామా జానకీనాయకా ౧౨

—* దశావతారములు *—

మ నిగమంబుల్గొనిపోవుసోమకునితో నీవంబుధి౯ జొచ్చి న
త్వాగతి౯ వానివధించి వేదచయముల్ వాణీశు కిప్పింప
వే । పగసాధించి, మహాత్మ యచ్యుత పరబ్రహ్మంబవై
నట్టి నీ । దగు మీనాకృతి కేను, మ్రొక్కెదను రామా
జానకీనాయకా ౧౩

శా దేవానీకము రాక్షసు ల్బలిమిచే ధీరాత్ములై మంధర । గ్రావంబు, న్బెకలించి పాలకడలిన్ గవ్వంబుగాఁద్రచ్చిన న్ । బావంబుల్వెడి లోకముల్ భయపడన్ బాలించి కూర్మంబవై । మావక్షస్థలి నిల్పవే గరిమ రామా జానకీనాయకా ౧౪

మ కనకాక్షుండు వరప్రభావపటిమన్ గర్వాంధుడై భూమితాఁ । గొని, వారాశినిడాగియున్నయపుడున్, క్రోడస్వరూపంబునన్ దనుజాధీశునిద్రుంచి యెప్పటిగతిన్ ధాత్రిన్ దగన్ నిల్పవే । మనుజాహారకులాటవీదహన రామా జానకీనాయకా ౧౫

శా నరసింహాకృతి నుక్కుకంబమునజన్మంబొంచు నత్యుగ్రతన్ । కరయుగ్మంబునఁబట్టి హేమకశిపున్ ఖండించి శాంతుండవై పరప్రహ్లాదులు మౌనిబృందములునిన్నాత్మన్ ప్రశంసింపఁగా । మఱి ప్రహ్లాదుని గాచి తీవెకద రామా జానకీనాయకా ౧౬

మ మరుగుజ్జుండవునై వటుండవగుచున్ మాధుర్యవాక్యంబులం । దరికిన్ మెప్పువహింపఁ బల్కుచు బలిన్ దానంబు మూడడుగులన్ । బరగన్వేఁడి గ్రహించిభూమి నభముల్ పాదద్వయింగప్పి క్ర । మ్మర పాదంబున దైత్యుఁద్రొక్కితివి రామా జానకీనాయకా ౧౭

మ జనకున్ జంపిన కోపవహ్ని దనరన్ శత్రుక్రూరంబుచే జనలోకేశుల నిర్వదొక్కతడవల్ సంధించి వేవేగమే। యనిలో రూపులు మాపు కక్షపునకున్ జ్యాదానమున్

జేయవే । మనసోత్సాహముతోడ నిందలంతు రామా
జానకీనాయకా ౧౮

ఉ మొదటం దాటకిఁద్రుంచి మౌనిసవనంబుంగాచి గౌరీశు
వి । ల్లదియంతన్ దునుమాడి భూసుతవివాహంబాచు
పిత్రాజ్ఞచే । ముదమొప్ప న్వనభూమికేగి జగముల్మోదింప
గారావణున్ । మదిలోభీతిలఁగూల్చవే ధరణి రామా
జానకీనాయకా ౧౯

మ బలరామాఖ్యుఁడవై హలాయుధమునం బల్మాఱుదైత్యే
శులం దలన్ద్రుంచి ప్రతాపమొప్పఖలులందండించి
శిష్టావనం । బిలఁ బ్రఖ్యాతిగసల్పి ధర్మములు పెంపే
ర్పాటుగానిల్పి ని । ర్మలకీర్తిన్ విలసిల్లితీవెకద రామా
జానకీనాయకా ౨౦

మ పురముల్మూఁడుజయింపఁగాఁ దలఁచియున్ బుద్ధుండవై
నేర్పుతోఁ । బురకాంతల్ వ్రతభంగమౌనటుల సంబోధింప
గౌరీశుడున్ । శరవహ్నిందహియింపఁ డాపురములన్
సర్వాత్మనీమాయ నీ । మరుఁగెవ్వండెఱుగంగశక్తుఁడగు
రామా జానకీనాయకా ౨౧

మ కలవేళన్ నృపులందఱుంగుమతులై గర్వాంధులై తుచ్ఛు
లై । ఖలులై ధర్మవిహీనులై పరగుచున్ గౌటిల్యతన్
బూనఁగాఁ । గలికాఖ్యన్జనియించి వారి నపుడున్
ఖండించి సద్ధర్మముల్ । మలినంబుల్విడఁగొట్టినిల్పెదవు
రామా జానకీనాయకా ౨౨

శా శ్రీసీతాపతి రాఘవేంద్ర కరుణాసింధుండసత్యవ్రతా
నీసాటెవ్వరులేరటంచు మదిలోనిక్కంబుగా నమ్మితిన్

నే సేవించెద నీపదాబ్జయుగళిన్ వేమారు నెల్లప్పుడున్ మా
సామీ నన్ను బ్రోవ నీకె సెలవు రామా జానకీనాయకా ౨౩

శా నేనీదాసుడనంటి నాకు వరముల్ నీవిమ్మటంటిం జుమీ
మీనామంబు తలంచినంటి దయతో మేలీయవే యంటి ని
న్నే నా బుద్ధిని నమ్మియుంటి కృపకున్ నీకన్న లేరంటి యో
మాధా నను నేలుమంటి గద రామా జానకీ
నాయకా ౨౪

మ కరుణాసింధుడవంచు నిన్ను మది నిక్కంబంచు నేనమ్మి నీ
చరణంబుల్ మదిఁ జేర్చి వేడితిని లేశంబైన దాక్షిణ్య
మున్ బూరయన్ జేయ వికేమి చేయువలయున్ బ్రా
త్య నేనెవ్వకన్ మరవ న్నీపదపద్మముల్మదిని రామా
జానకీనాయకా ౨౫

శా మిమ్మున్నంగ వశంబె ధాతకయినన్ మీపాదపద్మంబు
లన్ । నెమ్మింబుట్టియు లోకపావనియనన్ నీపుత్రి గంగా
నదిన్ । సమ్మోదంబున దా తరింప హరుడున్ పక్కం
దలం దాల్చడే మమ్మున్ బ్రోవగ నీవ యింకెవరు
రామా జానకీనాయకా ౨౬

మ శితికంఠుండు సహస్రనామములలో శ్రీరామనామంబు ను
న్నతభక్తిన్ జపియించువారిం మహానందంబు శోభిల్లు న
ద్గతికిన్ మూలమటంచు గౌరికని మంత్రంబంతయుం జెప్పె
నా । మతి నీమంత్రరహస్యమున్ దలతు రామా జనకీ
నాయకా ౨౭

శా రారా రాఘవ రామచంద్ర కరుణన్ రంజిల్ల నన్నేలరా
రారా జానకిప్రాణనాధ రఘువీరా నీవె నాదిక్కురా

రారా నీదయకేను పాత్రుడను రా రావయ్య నన్బ్రోవగా ।
మారాకార సహస్రశీర్షకృప రామా జానకీనాయకా

మ. హరబ్రహ్మాదులు మౌనిబృందములు నిన్నాత్మన్నిరూపిం
పలే। కెరుగంజాలక చిత్ప్రకాశుడవు లోకేశుండవంచున్
నమ । స్కారణంబుల్దగ జేసి కాంచిరిగదా సర్వంబు నీవం
చు ని । న్మదినే భంగిని గానగావశమె రామా జానకీ
నాయకా ౨౯

శా॥ గౌరీనాయక చాపఖండన త్రిలోకారాధ్య దైత్యాంత
కా। పారావార విహారశత్రుభయదా పాపఘ్న భక్తప్రియా
వీరాగ్రేసర రాఘవేశ హరి గోవిందా నన్నుఁ గావవే ।
మా రెన్నంగను లేరు నీసమము రామా జానకీనాయకా

మ. బలగర్వాంధుని దానశీలుని బలిన్ బంధింపవే పొట్టివై
బలిమిన్ జంపవె రాజులన్ పరశుచే పారుండవై యుగ్ర
తన్ ఖలుఁడౌ రావణుఁ ద్రుంపవే, యవనిజాకాంతుండవై
దేవ ని । ర్మలకీర్తుల్ప్రభవింపజేసితివి రామా జానకీ నా
యకా ౩౧

మ. నరమాంసాశనసంఘముల్దివిజులన్ దండించి దుష్టాత్ము
లై । పరగన్ వారిని బల్మిచే దునుముచున్ పద్మాక్ష
దేవావళిం । గరుణం బ్రోచితివీవె కావె సుగుణా కారు
ణ్యవారాసి నీ। మరుగుంజొచ్చినవారి కేకొదువ రామా
జానకీనాయకా ౩౨

శా ‘నీదాసుడ నీవునాదొరవు యింకెవ్వారినింగొల్తుని।
న్నే నాయాత్మదలంచువాడనిక నానేరంబులెన్నే నియున్

గానఁ వచ్చినగావగాదగురమాకాంతా భవత్సేవనే మా
నన్నష్టములెన్నివచ్చినను రామా జానకీనాయకా ౬౩

మ స్థిరబుద్ధిన్ నినునాశ్రయించి యెపుడున్ చిద్రూపసర్వేశ
యీ । శ్వర నారాయణ యిందిరారమణ దేవాభక్త
సంరక్షణా । పరమాత్మా మునికోటిపూజిత పరబ్రహ్మం
బవంచున్ మదిన్ । స్మరణల్ సల్పెదయిమ్ముసద్గతిని రామా
జానకీనాయకా ౬౪

శా శ్రీరామా రఘురామరామయని సేవింతునీపాదముల్
నీరూపెన్నగజాల గాన దయతో నీవేప్రసన్నుండవై ।
రారాయేమిభయంబురా యనుచు ధారాళంబుగా బల్కు
వేమారుంజెప్పక నిన్నుఁ జేరెదను రామాజానకీనాయకా॥

మ పదునాల్గు భువనంబులున్ సుఖరతిం బాటిల్లనిబొజ్జలో
మెదలన్ నీవుధరించి కాచెదవు స్వామీ నీకు దాసుండనీ ।
బదులేలేరని భక్తపీవె యనుచుం భక్తన్ మృదంగధ్వనిన్
మదమాతంగము నెక్కి సాటెదను రామా జానకీ యకా

మ గురువుల్ శిష్యులఁ గానవచ్చి స్వపదాంగుష్ఠంబులున్
గన్నులుం । బోరయం మ్రొక్కుమనంగవచ్చు శిరముల్
బూజించి మాకానకల్ । దలచిమ్మంచనవచ్చుగాని మరి
యాత్మన్ నిన్ను నీమాయ నీ । మరుగు ల్గానగలేరు
పండితులు రామా జానకీనాయకా ౬౭

మ సతతంబున్ ఘనవిద్యలున్ జదువుచున్ శాస్త్రంబులుం
జూచుచున్ । ప్రతిపాదించుచు తత్వమార్గరచనల్ భాషించి
బ్రహ్మంబుగాం । చితిగుంచున్ రుచిపుట్టగా సభలలో

చెప్పంగనేకానిదా। మతినిర్జించిన సౌఖ్యములన్గనరురామా
జానకీనాయకా ౩౮

మ. వరమంబైన భవత్కథానుతుల సద్భావంబు పద్యంబు
లన్। దరుచైతప్పులునున్న పుణ్య మరచేతంగాంతు
రెట్లన్ననన్। మరయంచున్ దపమాచరింపు యెరుకన్
మన్నించి మేలియ్యవా। మరువన్ బోకుము యిట్టిచంద
ములు రామా జానకీనాయకా ౩౯

మ. శ్రీకంఠుం డరచేతిపున్కవిడిచెన్ శ్రీదేవిభిక్షంబిడన్
శ్రీకంఠుండుమహేశ్వరాఖ్యదనరెన్ సేవించి నీదాసుడై
శ్రీకంఠుండు దహించె యాత్రిపురముల్ శీఘ్రంబు నీ
ప్రాపునన్। మాకింకేమిభయంబు నిన్గొలువ రామా
జానకీనాయకా ౪౦

మ. ఘనతన్ జెందిరి నీదునామపరనన్ గౌరీశ వాణీశులున్।
మునులున్ తారకనామజప్యమున నిన్నున్ నీపదాబ్జంబు
లున్ గనియుత్కృష్టమహాత్ములైరి నిను వేడ్కన్ గొల్చి
నన్ పాపము। ల్మనునే పోవునుకాక భస్మమయి రామా
జానకీనాయకా ౪౧

మ. కదలన్ బోకను వేయునోళ్ళ నహిలోకస్వామి మిమ్మె
ర్పడన్। తుదిముట్టన్ నుతియింపలేక నిగిడెన్ దోషఘ్న
నిన్నింక నా। సుదిసంస్తుత్యముచేయగావశమె నే మం
దుండ నజ్ఞానుడన్। మదినేనొక్కటిగంటి మీ శరణు
రామా జానకీనాయకా ౪౨

మ. పగనైనన్ వగనైన ప్రాణభయ మాపాదింపగానైన నీ।
దగునామంబు దలంచువారికి యథార్థంబైన పుణ్యంబు

లుం నిగమస్తుత్యు లటంచు నన్ను బలుకుల్ నిక్కంబటం
ట్లన్న న । మ్మగసుంటాశ్రితపుత్రుఁ గాంచినట్లరయ రామా జా
నకీనాయకా ౪౩

మ. జయరామా హరి వాసుదేవ గజరాట్సంత్రాసవి
చ్ఛేదనా నియతాత్మా యహిశాయి కృష్ణ వరదా ని
త్యానంద లోకేశ శ్రీ యుతాచిత్రసరోజభృంగమధుదై
త్యధ్వంసన సర్వేశ్వరా । మయపుత్రీధవకంఠనిర్దళన రామా
జానకీనాయకా ౪౪

మ. చనునే నామొఱ యాలకించక వృథావాదంబునం జేయ
గా । వినుమీ భక్తులకోటివాడ నగుదున్ వేరున్నదే నా
యెడన్ । అనఘా నన్ను దరింపజేయు మిక నీ కాత్మం
డ దాసుండ నై మనుచున్ నిన్ను స్మరించుచుండెదను
రామా జానకీనాయకా ౪౫

శా. స్వామీ నీవు పరాకుగాక వినుమీ స్వాంతంబునం దెల్లి
గా । నామాటల్ భవదీయదాసుడనుగాన్ శ్రీవరా
దేవ దే । వా మానాయక నిన్నె నమ్మితిని నీవాడన్ నను
గాచి యిమ్మా మోక్షంబు మదీయ వాంఛయిదె
రామా ౪౬

మ. మదిలో నిన్నుదలంచి వేడుకొని యేమంటిం దయాసా
గరా । విదురుండాడినభంగి నేనడిగితిన్ వేడన్ వరం
బిచ్చుటల్ । యిదినీకున్ సహజంబుకాదె దయతో యి
ష్టంబు లీడేర్చి నా । మదికిన్ సంతసమంద జేయగదె
రామా జానకీనాయకా ౪౭

మ శరణీకేమిసియుండెనా ? చెపుమా ఘంటాశ్రవుండేమ
నేఁ । శరతల్పుడగు భీష్ముడేమియొసఁగెఁ సద్భక్తియుఁ
దప్పనీ । శరణుఁజొచ్చినయావిభీషణుడు యేసంబంధియో
నీకు నీ। మరుగల్ నీవలపక్షము దెలిసె రామా జానకీ

శా॥ నీరూపంబు చింత శక్యమగునే నీపాదపద్మంబులుఁ।
జేరఁగ రాయి యహల్యయయ్యెఁ బృథివిఁ నీ తేశనీ మోహ
నా । కారంబీయెడనాకుజూపగదనే కాకుత్స్వవంశోద్భవా।
మారాకారయటం మగాల్చెదను రామా జానకీనాయకా

శా నీపాదాంబుజయుగ్మముఁ దలచెదఁ నీకీర్తనల్పాడెదఁ
గోపాలా యదునందనా యనుచు నీకుఁ మ్రొక్కెదఁ
భక్తితో । నీపేరం బ్రస్తుచేయుచుఁ గరములఁ నిన్నింక
బూజించెదఁ। యూపాలం గరుణింపవేమియెపుడు రామా ౧౦

మ జననంబై యిహలోకసౌఖ్యములచే సంతోషచిత్తుండనై
మనసంసారపయోధిలోమునిగి కాంక్షలిక్కిలై మూ
షతఁ । నినునెంతైనదలంపలేని నరుడఁ, నీచస్వభావుండ
నై । కనుచున్నాడను యేమిజెప్పవలె రామా జానకీ
నాయకా ౧౧

మ హరి గోవింద ముకుంద కృష్ణ జగధాధారాహివర్యంక
యీ । శ్వర గోపాలక చక్రహస్త కమలేశా రామ నా
రాయణా । మరిలోకేశ జనార్దనా భవహరా మౌనీంద్ర
సంసేవితా।మరుపెంతైనను రాదు నీమహిమ రామా ౧౨

మ వృధగాజేయకు నాదుమొఱ్ఱవిను నిన్వేడఁ పరాకా ద
యా । నిధివంచుఁ బహునమ్మినానిపుడు నన్నిట్లేచగా

న్యాయమా। విధిరుద్రామరవంద్య నీశరణు రావే నన్ను
రక్షింపవే। మధుసంహార భవత్పదాశ్రయుడ రామా ౹౨౼

మ బలిపాతాళముకంటద్రొక్కన భవత్పాదంబురాకుండెనో।
అలపాషాణముమీాది పాదమిపుడున్నట్లుండెనో గాక నీ।
విలసత్పాదములేటజూపవయ నీవేదిక్కునాకంటి ను।
మ్మలికన్ బెట్టక యిమ్ము వేవరము రామా ౹౨౪

మ నిను బ్రహ్మాదు లెరుంగలేరనినచో నేనెంతవాడన్ నినున్
గన నజ్ఞానుడ మూఢుడన్ జడుడ లోకస్తుత్య నీపాద
చిం। తనగల్గం గరుణింపవే దయను నిదానుండనై యు
ర్విలో। ననుదు నిన్ను దలంచుచు న్మదిని రామా ౹౨౫

మ తెలియన్ లేరు మహాత్మ నిన్ను మునులున్ దేవేంద్ర
రుద్రాదులే, వలనన్ నీపదపద్మముల్ దలచిరో వారెంత
యో శ్రేష్ఠులై, విలసత్కాంతులనొప్పియుండిరో ననున్
వీక్షించి రక్షింపు నే, మలినస్వాంతుడగాను దాసుడను
రామా జానకీనాయకా ౹౨౬

శా శ్రీనారాయణ రామ వేంద్ర కరుణాసింధుండ గోపాల కా।
సీ రామామృతసారమీయగదవే నీపాదభృత్యుడనై
నానాపాపచయంబుబాదుచు గానన్ మోక్షంబీయం
గదే। మానాధా శరణంచు వేడితిని రామా ౹౨౭

మ గురువై దేవుడవై సనాతనుడవై కోదండహస్తుండవై
కరుణానీరధివై జగన్నుతుడవై కౌసల్యాపుత్రుండవై
నెరి నాతల్లివి తండ్రివై బరగుచున్ నిత్యంబు నన్బ్రోవవే
మరుగుల్పెట్టకు నిన్నె నమ్మితిని రామా ౹౨౮

శా నాపాలం గృపగల్గి దొడ్డదొరవై నాతల్లివై తండ్రివై
నాపుణ్యంబులరాశివై ఘనుడవై నన్గాచుదైవంబవై। న
పాపపహామూర్తివై సముడవై న పెన్నిధానంబవై
మాపాలం గరుణించి బ్రోవగదె రామా జానకీనాయకా ౫౯

మ ఘనసంసారపయోధిదాటుటకుమార్గంబేదియో వేగనే
గనగా జేయగదయ్య యింకెవరు నన్గావంగ నీవయ్య ని
న్ననయంబుం భజియింతునయ్యమరినీ కాత్మ్యుండ నేనయ్య నీ
మనసుంబెట్టగదయ్య నాగతికి రామా జానకీనాయకా ౬౦

మ అరిషడ్వర్గములం జయించిసుఖినై యాత్మన్ నినున్ గొల్చినా
దురితంబుల్ హరియించితిం సకలదుర్దోషంబులం బాసితిం
హరినీదానుడనైతి నింక మది నీధ్యానంబుగావింతు క్ర
మ్మరజన్మంబులనొందకుండగను రామా జానకీనాయకా

మ హరు శైలాత్మజ నాంజనేయు ధ్రువు నయ్యక్రూరునిం
వ్యాసునిం, గరినిం భీష్ముని నారదుం బలి శుకుం ఘం
టాశ్రవుం ద్రౌపదిం, నరు ప్రహ్లాదు విభీషణుం గొలు
తునో నారాయణాయంచు వే, మరు నీనామము బాయ
కుండుదును రామా జానకీనాయకా
౬౨

మ గతినీవేయనినమ్మియుంటియిదియేగంటిం మరేచందముల్
మతిహీనుండనుగాన నేనెరుగ రామా నామన పద్మమం
దతికారుణ్యముతోడనిల్వగదె మోహాంధ్యంబులం బాసినే
మతిమంతుండనునాచు నిన్గనుదు రామా జానకీనాయకా ౬౩

మ స్థిరతం ధ్యానము సేయుసన్మునులకుం జిత్తాబ్జభృంగంబునై।
పురుహూతాది సమస్తదేవతలకుం బూజింపముఖ్యంబునై

పరగెన్ నీపదపంకజద్వితయమో పద్మాక్ష నీసాటిగా
మరియేదైవములేదు యెంచగను రామా జానకీనాయకా

శా. రామా నీదయ కేను పాత్రుడను రారా వేగ సన్నావరా
నీమాయల్గన లేనురా దెలుపరా నేకేమి భక్తుండరా । కా
మాంధుండను గానురా నిజమురా కౌటిల్యమిం కేలరా
మా మీదం గృప యుంచరా శుభము రామా జానకీ
నాయకా ౬౫

మ. జననంబందియు వృద్ధిబొంది పిదపన్ సంసారకృత్యంబు
లం । దనియం జేసితి చాలు నింక హరి నీదాసుండనై భక్తి
తో । జనలోకంబున నీదుకీర్తనసుధాసారంబునే గ్రోలెదన్
మనసుం బట్టి హరించు నాయఘము రామా జానకీ
నాయకా ౬౬

మ. హరి నావిన్నప మొక్కటైన వినవయ్యా పూర్వకాలమ్మున
న్ గరి మొఱ్ఱెట్లు వినంగ నోపితివి గంగానందనుం
డట్లు నీ । శరణుం జొచ్చిన నెట్లు బ్రోచితివి యాచందంబు
లట్లుండన । న్మదినిభ్యంగిని జూడవచ్చునయ రామా
జానకీనాయకా ౬౭

మ. తగదా నాకభయంబు నిచ్చుటకు నేదాసుండనయ్యుండ
గా । దగునా కంసవిదారి నన్ను విడ నా తప్పేదియో
జెప్పుమా । పగలున్ రాత్రియు నిన్ను నేదలతు నా భావం
బునన్ భక్తితో । మగుడన్ నాయెడ పంతమేమిటికి
రామా జానకీనాయకా ౬౮

మ. జపముల్ సల్పగలేదు పుణ్యనదులం జేరంగబోలేదు నే ।
నుపవాసంబుల నుండలేదు వినుమా యుష్మత్పదాంభోజ

షే। నెప్పుడుం నాహృదయంబునం నిలిపి నిన్నేగొల్తు
దైత్యౌఘభీ। మ పరాకేమిటికయ్య నాయెడను రామా
జానకీనాయకా ౧౯

మ పతినీవే గతినీవె నాదొరవునై పాలించగానీవె నం।మతి
మంతుండగజేయ నీవె దయతో నన్నేలగానీవె న।న్నతి
ప్రేమంబున బ్రోవ నీవెపుడు నాయాత్మ్యండవున్నీవె నా।
మతిలోనిల్చినవాడవీవెకద రామా జానకీనాయకా ౨౦

శా పుట్టింపంగను వృద్ధిజేయంగ, లయంబుంసల్పగానీవె నీ
గుట్టున్మాయలుగానలేరు విధియుం గూఢంబుగా క్రేపు
లం। బట్టించేమియొనర్చె చక్రధర నన్బాధించు పాపంబు
లం। మట్టించీయగదయ్య పుణ్యములు రామా జానకీ
నాయకా ౨౧

మ మనినేనొక్కటిగంటి భక్తులయెడం మన్నించుచందంబునే।
వదియుంజెప్పెద నంజనీసుతుని బ్రహ్లాదుం బలిం వ్యా
స ద్రౌ।పది నక్రూరు విభీషణుం విదురునిం బఖ్యాతిగా
గావవా। మదియందుంనను నట్టుజూడు మిక రామా జా
నకీనాయకా ౨౨

మ ఉడురాడ్జూటశరణ్యా శేషశయనా యుత్కృష్టకీర్తిప్రభా।
విడిపోనేరవు పూర్వజన్మఫలముల్ వేధించునంచు న్భయం।
పడి నీ పాదసరోజముల్ దలచి నీభక్తుండనైతింగదా।
మడియంజేయుము నాదుపాపములు రామా జానకీనా
యకా ౨౩

మ భ్రమలు న్నాకు మరేమిలేవు యిక నీపాదాబ్జముల్ గొ
ల్వగా। భ్రమమే యొక్కటిగన్నవాడ నటులం పాత్రం

డనై యుండెదన్ । సమబుద్ధిన్ నిను వేడెదన్ మనమునన్
సంతోషినై యుందు నా । మమతల్ద్రుంగ నీవ యింకెవ
రు రామా జానకీనాయకా ౨౪

మ దిననాథాయుతకోటితేజ దివిజాదిత్యాదిసంస్తుత్యస ।
న్మునిచిత్తాబ్జనివాసభక్తజనసమ్మోదాంఘ్రిపద్మద్వయా
నినునేనెప్పుడు రామరామయనుచున్నీయందు సద్భక్తితో ।
మనమందుంభజియింతు గావగదె రామా జానకీనాయకా
౨౫

మ సిరికిన్భర్తవునై సురాధిపులకున్సేవింప దైవంబవై । హర
బ్రహ్మాదు లెరుంగరాని బహుమాయామాత్ముండవై నీవుయీ ।
ధరణింబుట్టుచు దుష్టులందునుముచున్ ధర్మంబులంనిల్పు
చున్ । మరియాశ్చర్యముగా నటింతువయ రామా జాన
కీనాయకా ౨౬

శా కంటిన్ నీపదపద్మము ల్మనములో ఖండించితిన్ పాప
ముల్ । వింటిన్ నీనుచరిత్రముల్ముదముతో వైరిన్ విడం
గొట్టితిన్ । బంటన్ నిన్ను మనంబునం దలచుచుం ।
భావించి మేల్గాంచుచుం । మంటి న్నీదయ జెప్పగా వశమె
రామా జానకీనాయకా ౨౭

మ వరగర్వంబున నష్టదిక్పతులనున్ వంచించి కైలాసమున్ ।
గరముల్పాచియునెత్తినట్టిప్రబలున్ గర్వాంధునిన్ రావ
ణున్ । సురసంఘంబులు మెచ్చ ద్రుంచితివి నీశౌర్యత్వమున్
బల్కగా । మరిబ్రహ్మాదులకైన జొప్పడునె రామా జా
నకీనాయకా ౨౮

మ అతిభక్తిఁ నిను నెంతగానుతులు నాయాత్మఁ దగఁ జే
యగా। మతినింబెట్టవు యేమియంచనవు నమ్మఁలేవ నా
యందునఁ। గతినీవేయని యంటిగాని యెపుడుఁ గా
రుణ్యముఁ గల్గి నా। మతిలోనిల్చి కృతార్థుఁ జేయగదె
రామా జానకీనాయకా ౨౯

శా శ్రీ రాంభోధివిహార సర్వసుమనశ్చిత్తాబ్జసంచార శృం।
గారాకార సుమేరుధీరగిరిరాడ్గంభీర సద్భక్తమం। దారాం
భోధిసుతాత్మదార, పరతత్వాధార నీకీధరఁ। మారా రె
వ్వారిక నీవెక ర్తవయ రామా జానకీ నాయకా ౩౦

మ వనజాతిప్రభవామరేంద్రనుత దేహా సర్వభూతాదిరా।
ద్వవకోదండవిఖండనా। సకలపాపధ్వంస దైత్యాంతకా।
ఎనవే మూర్తజనావనా యనుచు నేవిజ్ఞాపనల్ సేయఁ
గా। మనసంబెట్టక యుండుటేమిటికి రామా జానకీ
నాయకా ౩౧

మ ఇక నేనెట్టులనిందలంతు హరి నన్నివేమిగా జేసెదో।యొక
మార్గంబిదియంచు జెప్పదగదే యోదేవ నీదాసుడఁ।
అకటా నాకభయంబులిమ్ము కరుణాత్మా నీవెనాదిక్కు
యా। మకరాక్షాసురప్రాణనిర్దళన రామా జానకీ
నాయకా ౩౨

మ మధురంబుల్ విడి చేదుగోరుకరశఁ మర్త్యావళుల్ వెఱ్ఱు
లై। వృథ దైవంబులగొల్చుటేమి ఫలమో వేమారు
నిన్వేడగా। నధికారంబున మోక్షమిచ్చుటకు దేవా నీ
వెదైవంబవో మధువైరీ యికమాటలేమిటిక రామా
జానకీ నాయకా ౩౩

మ కనకగ్రావము మందిరంబు కలుము ల్గన్నమ్మ యిల్లాలు
స ద్ఘవత సృష్టియొనర్చువాడు సుతుడున్ తద్దేవతల్
భృత్యులున్ । మునులున్ భక్తులు శౌరి మిత్రుడనగా
ముఖ్యుండవై కర్తవై । మనసావ్వన్ ప్రభువై నటింతువ
య రామా జానకీ నాయకా ౮౪

మ సుధ జన్మించిన తోడనే వనితవై శోభిల్లి దైత్యే
శులున్ । వ్యథజెందన్ సురబృందము ల్దనియ నీవావేళ
పీయూషము । తృధికంబొవ్వగబోసి రాక్షసల గర్వా
టోపముల్ మాన్పవే। మధురంబుల్ భువి నీచరిత్రములు
రామా జానకీనాయకా ౮౫

శా నీరూపంబిదియంచు నెన్నదరమా నే యేరికిన్ ధాత్రిపై
వీరాగ్రేసరు డర్జునుం డతనికీవేమూపవే రూపమున్
యేరూపంబనిరూఢలేక మదిలో యీశా పరబ్రహ్మ
మో। మారారీనుతయంచు మ్రొక్కెదను రామా జానకీ
నాయకా ౮౬

మ కరిపట్ణంబున కేగి కౌరవులతో కార్యానుకూలంబుగా ।
కురురాజొద్దను ధర్మరాజువలుకుల్ గొన్నిం దగంజెప్ప
నన్ । చెరుపుల్ జెప్పితివంచు నీయెడను దుశ్చేష్టలంలంపన్
సభన్ । మరినియద్భుతరూపుజూపితివి రామా జానకీ
నాయకా ౮౭

మ అరయన్ పార్వతిప్రాణనాధునకుమస్త్రాగ్రంబునన్ రత్నమై
వరమూనిశ్వరభక్తబృందమునకున్ భాసిల్లుమోక్షాంకమై
గరిమన్ సాయకశాయి కింజననియైగన్పించుము న్నెటికిన్
మరిపుట్టిలగు నంఘులం దలతు రామా జానకీనాయకా

మ. పతినివేయని నీదునామపరనం బాటించి దత్సారముం
సతతంబుం రుచిపుట్టజూతెనను నాసంకల్పము ల్దీర్చుమీ
సుతులున్నిక్కలిచేయునేర నెప్పుడుం నోరూరమీకీర్తనల్
మతినిల్పెను జరిగించుచుండెదను రామా ౮౯

మ. హరి నీపాదసరోజముల్ సతమునాయాత్మన్ననం జేసెదం
నెరినాకష్టము లెన్నడుం దరుగునో నేనెట్లునిన్గాంతునో
కరుణాసింధుడ చెప్పవే దయను లోకస్తుత్య లక్ష్మీశ యే
మర కేనెప్పుడు నీకుమ్రొక్కెదను రామాజానకీనాయకా

మ. హరి శ్రీకృష్ణ ముకుంద చక్రధర కంసారాతి వైకుంఠమం
దిర గోపాలక నందనందన రమాధిష్ఠానలోకేశ్వరీ
శ్వరగోవింద మురారి శౌరియనుచుం భక్తిం నినుంగొల్చునీ
చరణాంభోజార్చితినయ్య కావుమిక రామా జానకీనాయకా

మ. ఖరుని ద్రుంచి కబంధునిం దునిమి లోకద్రోహియౌ రా
వణుం। శరజాలంబులపాలు జేసి త్రిశిరుం శాసించి దైత్యా
ళినం దర దున్మాడియు లోకము మ్మోదమునొందం జేసి
తీవే దా। మరుపుల్ రావు భవత్ప్రతాపములు రామా
జానకీనాయకా ౯౨

మ. ఇక నెన్నింటికి నిన్ను నేవదల నాయిచ్చన్ దయాళుండవై
అకలంకుండను నీకుభక్తుడను నీయాత్మన్ సదాగొల్చెదన్
శుకభంగిన్ కృపగల్గినిశ్చలత నన్నుం గాచి రక్షింపవే
మకరిం ద్రుంచి కరీంద్రుగాచు క్రియ రామా జా ౯౩

మ. అదితీనందనులున్ విధాత మునులయ్యామ్నాయముల్
రుద్రుడున్। విదితంబొప్పగ గానలేరనగ నిన్నేడంగ నా

శక్యమే। చదువ ప్రత్నే ను మానవాధముడ నాశక్త్యనుసా
రంబుగా మదిలో నెప్పుడు గొల్చుచుండెదను రామా జా

మ. కరి నేలాగున గాచినావు ధృవుకాంక్షల్ దీర్చు టెబ్బంగియో
నరువాంఛావళి నెట్లొసంగితొ బలిన్ నాడెట్లు రక్షించితో
యెరుగన్ శ్రద్ధయనావు నాయెడను నీవిట్లు నిర్వచారించుటల్
మదినిం గాదరణంబు లేకుని రామా జానకీనాయకా ౯౫

మ. అహితల్పా ఖగవాహనా యసురసంహారా దయాసాగ
రా। తుహినోర్వీధరజార్చితా నిగమసంస్తుత్యా జగద్రక్ష
కా। విహగేంద్రధ్వజ చక్రహస్త వరదా విప్రాళిసంసేవితా
మహిపుత్రీధవ భక్తవత్సలుడ రామా జానకీనాయకా ౯౬

మ. అధికాశ్చర్యము నీచరిత్రములు సర్వాధీశ కీశాళి యం।బుధి
బంధించుట లంకకుం జనుటయుం పూర్వాసురాధీశులం।
వృధి వింగూల్చుట వాక్యమే నిటు లే వృద్ధ్యాదులుం
జేసిరే। మధువిధ్వంస మహాత్మ నీకెతగు రామా జానకీ
నాయకా ౯౭

మ. కమలేశా వనమాలి కృష్ణ హరి లోకారాధ్య శ్రీరాఘవా
కమలద్వేషణ కోటిపూర్ణవదనా కంజాక్ష మీపాదయు
గ్మము హృత్పద్మమునందు నిల్పితిని రమా నన్ను
రక్షింప నా। మమతల్ దీర్చుము నీకటాక్షమున రామా
జానకీనాయకా ౯౮

మ. కలడన్నంతనె యుక్కుకంబమున గల్గన్ లేదనీరూపు నా
పలుకుల్ యేల వినంగరావు చెపుమా పాపఘ్న నీకిట్లు
భ। క్తులయందున్ వలపక్షముల్దగునె నాకోర్కెల్ ప్ర

సాదించి ని। ర్మలచిత్తంబున నన్నుఁగాచకొను రామా
జానకీనాయకా ౯౯

శా॥ ఏనైతే నిను నమ్మినాడ నిక నన్నేలాగ నన్ గాచెదో।
నేనెవ్వారిదలంపలేదు నిజమే నీదాసుడన్ దీనుడన్।
నీనామస్తుతులాచరింతు మదిలో నీధ్యానముం జేసెదన్।
మానారీ హృదయేశ నిన్మరువ రామా జానకీనాయకా

శా॥ అయ్యా రాఘవరామచంద్ర రఘువంశాంభోధిశీతాంశునా
మయ్యా లింపగదయ్య భక్తజనులం గూర్మింపయన్ బ్రోవ
నీ। వయ్యా దైవమటంచు వేదచయము ల్వర్ణింపవే ని
న్నువే। మయ్యా నాకభయంబులియ్యవయ రామా
జానకీనాయకా ౧౦౧

మ॥ పదధూళిన్ శిల నాతిజేయుచు మహాభవ్యప్రకాశుండ
వై। కదనక్షోణిని రావణాద్యసురులంఖండించు వీరుండ
వై। మదిలో నిన్నుదలంచు భక్తులను సంభావించు దై
వంబవై। మదియుప్పొంగ జగంబులేలుదువు రామా
జానకీనాయకా ౧౦౨

మ॥ సతులం బుత్రుల భ్రాతలం బ్రియముచే సఖ్యంబునన్
భ్రామికల్। మతినింబెట్టగలేదు నీచరణపద్మంబు ల్మ
దింజేర్చితో। పతితత్రాణయటంచు నీకృపకు నేపాత్రుం
డనై యుంటి సమ్మతితోడన్ ననుగావుమీదయను రామా
జానకీనాయకా ౧౦౩

శా॥ శ్రీరామా సురసేవితాంఘ్రియుగళా సీతామనోనాయకా
పారావార విహార భక్తవరదా పద్మాక్షలోకేశ్వరా

వీరాగ్రేసర రావణాంతక జగద్విఖ్యాతిగా నాయెడన్
మారుంబల్కక యుమ్ము సద్గతిని రామా జా ౧౦౪
శా రావే నారదపన్నుత రఘువరా రావే జగన్నాయకా
రావే నివనినమ్మినాడ దయతో రావే ననుం గావవే
రావే నీకు నమస్కరింతు నెపుడుం రావే దయాసాగరా
మావెన్నుండవు నిన్నెనమ్మితిని రామా జానకీనాయకా
శా నేనీదాసుడనైతి నాయఘములం నిర్జించి మీపాదము
ల్గానంగోరితి నిమ్ము నాకు వరము న్గావం దయాదృష్టిచే
శ్రీనాథా ననునేలవయ్య వరదా చిద్భావసర్వేశ నా
మా నాచిత్తమునందునిల్పితిని రామా జానకీనాయకా
మ అనిశంబున్ భవదీయనామచరితంబైనట్టి యీపద్యము
ల్వినినన్ వ్రాసిన బల్కినన్ దురితముల్విధ్వంసమైపోయి
శో। భనసౌఖ్యమ్ములు నబ్బుపుణ్యములునుం బ్రా ప్తించు
నెవ్వారికిన్। మనమందుం దృఢబుద్ధినిన్ దలప రామా
మ ఘనుడౌ శీతనమంత్రికిం దనయుడం గౌండిన్యగోత్రుండ
న। జ్జనడన్ మాటురి వెంకటాఖ్యుడ కవుల్ సంతుష్టులై
మెచ్చగా। ననఘా నే రచియించితిన్ శతక మి ట్లత్యంత
భక్తిన్ దగన్। మనసొప్పన్ భవదంకితంబుగను రామా
జానకీనాయకా ౧౦౮

